# అథ పంచాశత్తమో%ధ్యాయః

# పరిహాసములు

బ్రహ్మోవాచ |

తతశ్చాహం మునిగణై శ్శేష కృత్యం శివాజ్ఞయా | అకార్షం నారద ప్రీత్యా శివాశివ వివాహతః || 1

తయోశ్శిరో%భిషేకశ్చ బభూవాదరతస్తతః | ధ్రువస్య దర్శనం విప్రాః కారయామాసురా దరాత్ || 2

హృదయాలంభనం కర్మ బభూవ తదనంతరమ్ | స్వస్తి పాఠశ్చ విప్రేంద్ర మహోత్సవపురస్సరః || 3

శివాశిరసి సిందూరం దదౌ శంభుర్ద్విజాజ్ఞయా | తదానీం గిరిజాభిఖ్యాద్భుతావర్ణ్యా బభూవ హ || 4

బ్రహ్మ ఇట్లు పలికెను -

ఓ నారదా! తరువాత నేను శివుని పార్వతీ పరమేశ్వరుల వివాహములో మిగిలిన కార్యమును ముని గణములతో గూడి ప్రతీతో చేసితిని (1). బ్రాహ్మణులు వారద్దరికి తరువాత శిరస్సులపై అభిషేకమును సాదరముగా జరిపించిరి. తరువాత ధ్రువనక్షత్ర దర్శనమును చేయించిరి (2). ఆ తరువాత హృదయమును స్పృశించుట అను కర్మ జరుపబడెను. ఓ బ్రాహ్మణ శ్రేష్ఠా! స్వస్తి పఠనము మహోత్సవముతో సాగెను (3). శంభుడు బ్రాహ్మణుల ఆజ్ఞచే పార్వతి శిరస్సుపై సిందూరమునంచెను. అపుడు పార్వతి వర్ణింపశక్యము కాని అద్భుత సౌందర్యముతో నలరారెను (4).

తతో విప్రాజ్ఞయా తౌ ద్వావేకాసన సమాస్థితౌ | లేభాతే పరమా శోభాం భక్తచిత్తముదా వహామ్ || 5

తతస్స్వ స్థానమాగత్య సంస్రవప్రాశనం ముదా | చక్రతుస్తౌ నిదేశాన్మేఽద్భుత లీలాకరౌ మునే || 6

ఇత్థం నివృత్తే విధివద్యా జ్ఞే వైవాహికే శివః | బ్రహ్మణ    పూర్ణ పాత్రం మే దదౌ లోకకృతే ప్రభుః || 7

గోదానం విదివచ్ఛంభు రాచార్యాయ దదౌ తతః | మహాదానాని చ ప్రీత్యా యాని మంగళదాని వై || 8

అపుడు బ్రహ్మణుల ఆజ్ఞచే వారిద్దరు ఒకే ఆసనమునందు గూర్చుండి పరమశోభను కలిగియుండిరి. ఆ దృశ్యమునకు భక్తుల చిత్తములు ఉప్పొంగును (5). ఓ మునీ! తరువాత అద్భుతమైన లీలలను ప్రదర్శించే ఆ దంపతులు నా ఆదేశముచే తమ స్థానములకు వచ్చి మోమ శేషద్రవ్యమును ఆనందముతో బుజించిరి (6). ఈ తీరున వివాహయజ్ఞము యతావిదిగా సంపన్నము కాగా, శివప్రభుడు సృష్టకర్త, బ్రహ్మ అగు నాకు పూర్ణ పాత్రను ఇచ్చెను (7). తరువాత శంభుడు యథావిధిగా గో). దానమును ఆచార్యునకిచ్చి, మంగళములనిచ్చే మహాదానములను కూడా ప్రీతితో చేసెను (8).

తతశ్శతసువర్ణం చ విప్రేభ్యస్స దదౌ పృథక్ | బహుభ్యో రత్నకోటీశ్చ నానాద్రవ్యాణ్యనే కశః || 9

తదానీమమరాస్సర్వే పరే జీవాశ్చరాచరాః | ముముదుశ్చేతసాతీవ బభూవాతి జయధ్వనిః || 10

మంగలధ్వనిగానం చ బభువ బహు సర్వతః | వాద్యధ్వనిరభూద్రమ్యో సర్వానందప్రవర్ధనః || 11

హరిర్మయాథ దేవాశ్చ మునయశ్చాపరేఽఖిలాః | గిరిమామంత్ర్య సుప్రీత్యా స్వస్థానం ప్రయయుర్ద్రుతమ్ || 12

తరువాత ఆయన బ్రాహ్మణులకు ఒక్కొక్కరికి వంద సువర్ణముల నిచ్చెను. కోట్ల కొలది రత్నములను, వివిద ద్రవ్యములను అనేక మందికి ఇచ్చెను (9). అపుడు సర్వదేవతలు, ఇతరములగు చరాచర ప్రాణులు మనస్సులో చాల ఆనందించి జయధ్వనులను చేసిరి (10). సర్వత్ర అనేక మంగళధ్వనులు, గానములు ఆరంభమయ్యెను. సర్వులకు ఆనందమును పెంపొందించే రమ్యమగు వాద్యధ్వని చెలరేగెను (11). విష్ణువు, నేను, దేవతలు, మునులు ఇతరులు అందరు హిమవంతుని అనుమతిని పొంది మహానందముతో వెంటనే వారి వారి స్థానములకు వెళ్లితిమి (12).

తదానీం శైలనగరే స్త్రియశ్చ ముదితా వరమ్ | శివాశివౌ సమానీయ యయుః కుహవరాలయమ్ || 13

లౌకికాచారమాజహ్రుస్తాస్సర్వ యత్సత్ర చాదృతాః | మహోత్సాహో బభూవాథ సర్వతః ప్రముదావహః || 14

అథ తాస్తౌ సమానీయ దంపతీ జనశంకరౌ | వాసాలయం మహాదివ్యం భవాచారం వ్యధుర్ముదా || 15

అథో సమీపమాగత్య శైలేంద్ర నగరస్త్రియః | నిర్వృత్య మంగలం కర్మ ప్రాపయన్ దంపతీ గృహమ్ || 16

అపుడు హిమవంతుని రాజధానిలో స్త్రీలు మహానందముతో పార్వతీ పరమేశ్వరులను దోడ్కొని హిమవంతుని గృహమునకు వెళ్లిరి (13). ఆ స్త్రీలు సాదరముగా లోకాచారములను నిర్వర్తింపజేసిరి. అంతటా ఆనందదాయకమగు మహోత్సాహము వెల్లివిరిసెనున (14). అపుడు వారు జనులకు కల్యాణమును చేసే ఆది దంపతులగు పార్వతీ పరమేశ్వరులను మహాదివ్యమగు వాసగృహమునకు దోడ్కొని వెళ్లి ఆనందముతో లోకాచారములను నెరపిరి (15). అపుడు హిమవంతుని రాజధానిలోని స్త్రీలు వారి దగ్గరకు వచ్చి మంగళకర్మలను చేయించి దంపతులను వాసగృహములో ప్రవేశ##పెట్టిరి (16).

కృత్వా జయధ్వనిం చక్రుర్గ్రంథినిర్మోచనాదికమ్ |
సస్మితాస్సకటాక్షాశ్చ పులకాంచితవిగ్రహాః || 17

వాసగేహం సంప్ర విశ్య ముముహుః కామినీవరాః | ప్రశంసంత్యస్స్వ
భాగ్యాని పశ్యంతః పరమేశ్వరమ్ || 18

మహాసురూప వేషం చ సర్వలావణ్య సంయతమ్ | నవీన ¸ౌవనస్థం
చ కామినీ చిత్త మోహనమ్ || 19

ఈషద్ధాస్యప్రసన్నాస్యం సకటాక్షం సుసుందరమ్ | సుసూక్ష్మవాసో
బిభ్రాణం నానారత్నవిభూషితమ్ || 20

తదానీం దివ్యనార్యశ్చ షోడశారం సమాయయుః | తౌ దంపతీ చ
సంద్రష%్టం మహా దరపురస్సరమ్ || 21

ఆ స్త్రీలు పులకించిన దేహములు గలవారై చిరునవ్వుతో ఒకరి నొకరు చూసుకొనుచూ జయధ్వనిని చేసి వధూవరుల వస్త్రముల ముడిని విప్పుడట మొదలగు పనులను పూర్తి చేసిరి (17). ఆ ఉత్తమ స్త్రీలు వాసగృహమును ప్రవేశించి దాని శోభకు మోహమును పొందిరి. వారు పరమేశ్వరుని చూస్తూ తమ భాగ్యములను ప్రశంసించుకొనిరి (18). గొప్ప అందమైన రూపము వేషము గలవాడు, సొగసులన్నిటితో కూడి యున్నవాడు, నూతన ¸ౌవనము నందున్నవాడు, స్త్రీల చిత్తమును మోహింపజేయువాడు (19). చిరునవన్వుతో ప్రసన్నమగు ముఖము గలవాడు, సుందరమగు చూపులు గలవాడు, విలువైన వస్త్రమును ధరించినవాడు, అనేక రత్నాభరణములను అలంకరించు కున్నవాడు అగు శివుని జూచిరి (20). అపుడు ఆ దంపతులను చూచుటకు పదునార్గురు దివ్యస్త్రీలు వెంటనే మహాదరమతో విచ్చేసిరి (21).

సరస్వతీ చ లక్ష్మీశ్చ సావిత్రీ జాహ్నవీ తథా | అదాతిశ్చ శచీ చైవ
లోపాముద్రాప్యరుంధతీ || 22

అహల్యా తులసీ స్వాహా రోహిణీ చ వసుంధరా | వతరూపా చ సంజ్ఞా చ రతిరేతాస్సురస్త్రియః || 23

దేవకన్యా నాగకన్యా మునికన్యా మనోహరాః | తత్ర య యాస్థ్సి తాస్తాసాం సంఖ్యాం కర్తుం చ కః క్షమః || 24

తాభీ రత్నాసనే దత్తే తత్రోవాస శివో ముదా | తమూచుః క్రమతో దేవ్యస్సుహాసం మధురం వచః || 25

సరస్వతి, లక్ష్మి, సావిత్రి, గంగా, అదితి, శచి, లోపాముద్ర, అరుంధతి (22), అహల్య, తులసి, స్వాహా, రోహిణి, పృథివి, శతరూప, సంజ్ఞ, రతి అను దేవతా స్త్రీలు విచ్చేసిరి (23). అక్కడ ఉన్న మనోహరలగు దేవకన్యలు, నాగకన్యలు, మునికన్యలు అందరు విచ్చేసిరి. వారి సంఖ్యను చెప్పగలిగే సామర్థ్యము ఎవరికి గలదు? (24) వారు సమర్పించిన రత్నమయమగు ఆసనమునందు శివుడానందముతో కూర్చుండెను. అపుడా దేవీమూర్తులు క్రమముగా ఆయనతో చిరునవ్వుతో గూడిన మధురవచనమునిట్లు పలికిరి (25).

సరస్వత్యువాచ |

ప్రాప్తా సతీ మహాదేవాధునా ప్రాణాధికా ప్రియా | దృష్ట్వా ప్రియాస్యం చంద్రభం సంతాతపం త్యజ కాముక || 26

కాలం గమయ కాలేశ సతీ సంశ్లేష పూర్వకమ్ | విశ్లేషస్తే న భవితా సర్వకాలం మమాశ్రితా || 27

సరస్వతి ఇట్లు పలికెను-

మహాదేవా! ఇపుడు నీకు ప్రాణముల కంటె అధిక ప్రియురాలగు సతీదేవి లభించినది. ఓయి సుందరా! ప్రియురాలి చంద్రుని వంటి ముఖమును చూచి తాపమును వీడుము (26). ఓయీ కాలనియంతా!

నీవు సతితో కలిసి కాలమును గడుపుము. మీకు వియోగము ఏ కాలము నందైననూ ఉండబోదు. పార్వతి నాకు ఆశ్రితురాలు కాగలదు (27).

లక్ష్మీ రువాచ |

లజ్జాం విహాయ దేవేశ సతీం కృత్వా స్వవక్షసి | తిష్ఠ తాం ప్రతి కా లజ్జా ప్రాణా యాంతి యయా వినా || 28

లక్ష్మీ దేవి ఇట్లు పలికెను-

ఓ దేవ దేవా! సిగ్గును వీడి సతిని నీ గుండెలలో దాచు కొనుము. ఆమె లేనిదే నీకు ప్రాణములు నిలువవు. ఆమె విషయములో లజ్జ యేల? (28)

సావిత్ర్యువాచ |

భోజయిత్వా సతీం శంభో శీఘ్రం త్వం భుంక్ష్వ మా ఖిదః | తదాచమ్య సకర్పూరం తాంబూలం దేహి సాదరమ్ || 29

సావిత్రి ఇట్లు పలికెను -

ఓ శంభూ! సతిని భుజింపజేసి నీవు శీఘ్రమే భూజించుము. ఖేదమును పొందకుము. తరువాత నీటిని త్రాగి కర్పూర తాంబూలమును ఆమెకు ఆదరముతో నిమ్ము (29).

జాహ్నవ్యువాచ |

స్వర్ణ కాంతి కరాం ధృత్వా కేవాన్మార్జయ యోషితః | కామిన్యా స్వామి సౌభాగ్య సుఖం నాతః పరం భ##వేత్ |7 30

గంగా దేవి ఇట్లు పలికెను

బంగరు కాంతి గల ప్రియురాలి చేతిని బట్టుకొని కేశములను సరిచేయుము. ప్రభువునకు లభించే సౌభాగ్య సుఖము ఇంతకంటె గొప్పది ఉండబోదు (30).

అదితిరువాచ |

భోజనాంతే శివం శంభుం ముఖశుద్ధ్యర్థమాదరాత్ | జలం దేహి మమాప్రీత్యా దంపతి ప్రేమ దుర్లభమ్ || 31

అదితి ఇట్లు పలికెను -

పార్వతీ! భోజనము తరువాత ఆ శివశంభునకు ముఖమును కడుగు కొనుటకై ఆదరముతో మహా ప్రేమతో నీటని ఇమ్ము. ఇట్టి ప్రేమ దంపతుల మధ్య దుర్లభ##మైనది (31).

శచ్యువాచ |

కృత్వా విలాపం యద్ధేతో శ్శివాం కృత్వా చ వక్షసి | యో బభ్రామానశం మోహాత్ కా లజ్ఞా తే ప్రియాం ప్రతి || 32

ఎవతె కొరకై నీవు విలపించి రాత్రింబగళ్లు మోహముతో తిరుగాడితివో, అట్టి శివాదేవిని గుండెలో దాచుకొనుము. అట్టి ప్రియురాలి విషయములో లజ్ఞకు స్థానమేది? (32)

లోపాముద్రోవాచ |

వ్యవహారో%స్తి చ స్త్రీణాం భుక్త్వా వాసగృహే శివ | దత్త్వా తాంబూలం శివాయై శయనం కర్తుమర్హసి || 33

లోపాముద్ర ఇట్లు పలికెను -

ఓ శివా! వాస గృహములో భుజించిన తరువాత స్త్రీలకు పని మిగిలి యుండును. పార్వతికి తాంబూలమునిచ్చి నీవు శయనించవచ్చును (33).

అరుంధత్యు వాచ |

మయా దత్తాం సతీ మేనాం తుభ్యం దాతుమనీప్సితామ్ | వివిధం బోధయిత్వేమాం సురతిం కర్తు మర్హసి || 34

అరుంధతి ఇట్లు పలికెను -

మేన ఈమెను నీకు ఇచ్చి వివాహము చేయుటకు అంగీకరించలేదు. కాని నేను ఆమెకు పరిపరి విధముల బోధించి నీకు వివాహము చేయించితిని. కాన ఈమెను జాగరూకతతో పాలించుము (34).

అహల్యోవాచ |

వృద్ధావస్థాం పరిత్యజ్య హ్యతీవ తరుణోభవ | యేన మేనాను మన్యేత తాం సుతార్పిత మానసా || (35).

అహల్య ఇట్లు పలికెను-

నీవు వృద్ధావస్థను విడిచి పెట్టి నవయువకుడవు కమ్ము. అట్లు చేయుట వలన, తన మనస్సును కుమార్తెపై లగ్నము చేసి యున్న మేన నిన్ను అంగీకరించును (35).

తులస్యువాచ |

సతీ త్వయా పరిత్యక్తా కామో దగ్ధఃపురా కృతః | కథం తదా వసిష్టశ్చ ప్రభో ప్రస్థాపితో% ధునా || 36

తులసి ఇట్లు పలికెను -

ఓ ప్రభూ! నీవు సతిని పరిత్యజించి, పూర్వము మన్మథుని దహించితివి. అట్టి నీవు ఈనాడు వసిష్టుని ఈమె కొరకై ఏల పంపితివి? (36).

స్వాహోవాచ |

స్థిరో భవ మహాదేవ స్త్రీణాం వచసి సాంప్రతమ్ | వివాహే వ్యవహారే%స్తి పురంధ్రీణాం ప్రగల్భతా || 37

స్వాహా దేవి ఇట్లు పలికెను -

మహా దేవా! ఇప్పుడు నీవు స్త్రీల మాటలను జవదాటకుము. వివాహమునందు, వ్యవహారము నందు స్త్రీలకు ప్రాగల్భ్యము కలదు (37).

రోహిణ్యువాచ |

కామం పూరయ పార్వత్యాః కామశాస్త్ర విశారద | కురు పారం స్వయం కామీ కిమినీ కామ సాగరమ్ || 38

రోహిణి ఇట్లు పలికెను-

ఓయీ కామశాస్త్ర విశారదా! పార్వతి కోర్కెను తీర్చుము. నీవు స్వయముగా కామివై కామినితో గూడి కామ సముద్రమును దాటుము (38).

వసుంధరో వాచ |

జానాసి భావం భావజ్ఞ కామార్తానం చ యోషితామ్ | న చ స్వం స్వామినం శంభో ఈశ్వరం పాతి సంతతమ్ |7 39

వసుంధర ఇట్లు పలికెను -

ఓయీ! భావము నెరింగినవాడా! కోరిక గల యువతుల భావములు నీవు ఎరుకయే. ఓ శంభో! ధనము సమర్థుడగు ప్రభువును సర్వదా రక్షించదు (39).

శతరూపోవాచ |

భోగం దివ్యం వినా భుక్త్వా న హి తుష్యేత్ క్షుధాతురః | యేన తుష్టిర్భవేచ్ఛంభో తత్కర్తు ముచితం స్త్రియాః || 40

శతరూప ఇట్లనెనున-

ఆకలి గొన్న వానికి మృష్టాన్నమును భుజించనిదే ఆకలి తీరదు. ఓ శంభూ! ఏ కార్యము చే స్త్రీకి తృప్తి కలుగునో, ఆ పనిని చేయుట నీకు తగును (40).

సంజ్ఞోవాచ |

తూర్ణం ప్రస్థాపయ ప్రీత్యా పార్వత్యా సహ శంకరమ్ | రత్న ప్రదీపం తాంబూలం తల్పం నిర్మాయ నిర్జనే || 41

సంజ్ఞ ఇట్లు పలికెను -

ఓసీ శతరూపా! నిర్జన స్థానములో తల్పమును ఏర్పాటు చేసి రత్న దీపమునమర్చి తాంబూలము నుంచి పార్వతీ పరమేశ్వరులను ప్రేమతో అచటకు వెంటనే పంపుము (41).

బ్రహ్మోవాచ |

స్త్రీణాం తద్వచనం శ్రుత్వా తా ఉవాచ శివస్స్వయమ్ | నిర్వికారశ్చ భగవాన్ యోగీంద్రాణాం గురోర్గురుః |7 42

బ్రహ్మ ఇట్లు పలికెను-

స్త్రీల ఆ మాటలను విని వికారములు లేనివాడు, యోగివరుల గురువులకు గురువు అగు శివుడు వారితో స్వయముగా నిట్లనెను (42).

శంకర ఉవాచ |

దేవ్యో న బ్రూత వచనమేవం భూతం మమాంతికమ్ | జగతాం మాతరస్సాధ్వ్యః పుత్రే చపలతా కథమ్ |7 43

శంకరుడిట్లు పలికెను -

ఓ దేవీ మూర్తులారా! నా వద్ద ఇట్టి వచనములను పలుకకుడు. జగన్మాతలు, పతివ్రతలు అగు మీరు పుత్రుని విషయములో చాపల్యమునేల కలిగి యున్నారు? (43)

బ్రహ్మోవాచ |

శంకరస్య వచశ్శ్రుత్వా లజ్జితాస్సురయోషితః | బభూవుస్సంభ్రమాత్తూష్ణీం చిత్ర పుత్తలికా యథా || 44

భుక్త్వా మిష్టాన్న మాచమ్య మహేశో హృష్టమానసః | సకర్పూరం పచ తాంబూలం బుభుజే భార్యయా సహ || 45

ఇతి శ్రీ శివ మహాపురాణ    రుద్ర సంహితాయాం పార్వతీ ఖండే పరిహాస వర్ణనం నామ పంచాశత్తమో%ధ్యాయః (50)

బ్రహ్మ ఇట్లు పలికెను-

శంకరుని మాటవిని సిగ్గుపడిన ఆ దేవతా స్త్రీలు కంగారుపడి చిత్రమునందలి స్త్రీ మూర్తులవలె ఉలుకు పలుకు లేక ఉండిరి (44). మహేశ్వరుడు మృష్టన్నమును భుజించి ఆచమనము చేసి ఆనందముతో కూడిన మనస్సు గలవాడై భార్యతో కలసి కర్పూర తాంబూలమును సేవించెను 45).

శ్రీ శివ మహాపురాణములో రుద్ర సంహితయందు పార్వతీ ఖండలో పరిహాసవర్ణనమనే ఏ బదియవ అధ్యాయము ముగిసినది (50).